

శ్రీమతే రామానుజాయ నమః

# గోపాలవింశతి



శ్రీకృష్ణస్వామి, ద్వారక



'పండితరత్న'

డా|| ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అహ్లాగ శింగరాచార్యులు

సమర్పణ: మొలుగు వేంకటాచార్య, తిరుచనూరు

వంగల వేంకట కేశవ అయ్యంగారు

# గోపాలవింశతి

అవతారిక:

శ్రీదేశికులు శ్రీకృష్ణునిగూర్చి రచించిన ఈ గోపాల వింశతి అనే స్తుతిలో ఇరవై శ్లోకాలున్నాయి. ఇందులో క్రమంగా గోపాలమంత్రయంత్రవిన్యాసం, వెన్నను దొంగిలించడంకోసం కృష్ణుడు చేసే నృత్యం, యశోదచే అతడు బంధింపబడడం, బృందావనంలో, గోకులంలో అతడు కొన్ని లీలలు, ఉలూఖలబంధం, వేణుగానం, రాసక్రీడ, గోపికావస్త్రాపహరణం –ఇత్యాది పలు లీలలు వర్ణింపబడ్డాయి, చివరగా ఈ స్తుతిని పఠించినవారికి కలిగే ఫలాన్ని తెలిపి, దేశికులు ఈ స్తుతిని ముగించారు.

★★★★

1)వందే బృందావనచరం వల్లవీజనవల్లభమ్।
జయంతీసంభవం ధామ వైజయంతీవిభూషణమ్॥

జయంతి అంటే–సింహ(శ్రావణ)మాసంలోని కృష్ణపక్షంలో అష్టమీతిథితోకూడిన రోహిణీనక్షత్రం. ఈ శుభదినాన కృష్ణుడు అవతరించాడు. ఇతడు ఎల్లప్పుడు వనమాల అనే మాలికను వక్షఃస్థలంలో అలంకరించుకొంటాడు. బృందావనం అనేది ఉత్తరమధురానగరానికి సమీపంలో ఉండే ఒక ఆందమైన వనం. శ్రీకృష్ణుడు తన తోటి గొల్ల బాలకులతో కలసి ఈ వనంలో గోవులను మేపాడు. రేపల్లెలోని గోపికల ప్రేమకు లక్ష్యమైనవాడితడు. ఇటువంటి, శ్రీకృష్ణుడనే గొప్ప జ్యోతిని నమస్కరిస్తున్నాను.

2)వాచం నిజాంకరసికాం ప్రసమీక్షమాణో వక్త్రారవిందవినివేశితపాంచజన్యః।
వర్ణత్రికోణరుచిరే వరపుండరీకే బద్ధాదరో జయతి వల్లవచక్రవర్తీ॥

బాలుడైన శ్రీకృష్ణునకు దృష్టిదోషం తగులుతుందేమో! అని భయపడిన తల్లిదండ్రులు అతనికి రక్షను పెడుతున్నారు. ఎనిమిది రేకులను కల, తామరపూవురూపంలోని ఆసనాన్ని ఏర్పరచి, అందులో మూడు కోణాలను కల యంత్రాన్ని అమర్చి, అందులో శ్రీకృష్ణుని కూర్చోపెట్టారు. విద్యాధిదేవత సరస్వతి అతని ఒడిలో ఆనందంతో కూర్చొని, ఆ యంత్రంలో అక్షరరూపంలోని తన స్వరూపాన్ని చూచి ఆనందిస్తున్నది. ఆమెను శ్రీకృష్ణుడు తన నేత్రాలతో కటాక్షిస్తున్నాడు. ఆమెకు జ్ఞానాన్ని కల్గించేవాడైన అతడు తనవద్ద జ్ఞానాన్ని ఇచ్చే శంఖం ఉన్న గొప్పదనాన్ని వ్యక్తం చేయడం కోసం తన నోటిలో పాంచజన్యశంఖాన్ని పెట్టుకొన్నాడు. తన సౌలభ్యగుణాన్ని చూపడంకోసం అవతరించి, రేపల్లెకు వచ్చి, వారికి నాథుడైన ఆ శ్రీకృష్ణుడు గొప్పగా ప్రకాశిస్తున్నాడు.

(ఈ శ్లోకం మంత్రశాస్త్రాన్ని ఆధారంగా చేసికొని రచింపబడిందని పెద్దలంటారు. దీనిని పలువురు వ్యాఖ్యాతలు పలు విధాలుగా వివరించారు.)

3)ఆమ్నాయగంధిరుదితస్ఫురితాధరోష్ఠమ్
అస్రావిలేక్షణ మనుక్షణమందహాసమ్।
గోపాలడింభవపుషం కుహనాజనన్యాః
ప్రాణస్తనంధయ మవైమి పరం పుమాంసమ్॥

వేదగంధాన్ని వీచే (వేదాల అర్థాలను కల) రోదనశబ్దాలతో కదలాడే పైపెదవిని, కింది పెదవిని కలవాడు, కన్నీరు కారడంవల్ల ఎఱ్ఱబడిన కన్నులను కలవాడు, మాటిమాటికి చిరునవ్వు నవ్వేవాడు, వంచనతో తల్లిరూపంలో వచ్చిన పూతనప్రాణాలను ఆమెపాలతో పాటు తాగినవాడైన గోపాలబాలరూపుని పరమపురుషునిగా తెలిసికొంటున్నాను.

4)ఆవిర్భవత్వనిభృతాభరణం పురస్తాత్
ఆకుంచితైకచరణం నిభృతాన్యపాదమ్।
దధ్నా నిమంథముఖరేణ నిబద్ధతాళం
నాథస్య నందభవనే నవనీతనాట్యమ్॥

నందగోపుని ఇంటిలో యశోద పెరుగు చిలుకుతున్నది. శ్రీకృష్ణుడు ఆమె దగ్గరకు వెళ్ళి వెన్న పెట్టమని మారాం చేస్తున్నాడు. వెన్నకోసం ఆమె ఎదుట ఒక కాలు మడచుకొని, ఇంకొక కాలు కదపకుండా నిలుపుకొని, నాట్యం చేస్తున్నాడు. అపుడతడు అలంకరించుకొన్న ఆభరణాలు అటు ఇటు కదలుతున్నాయి. దానితో పాటు పెరుగు చిలికినపుడు వచ్చే శబ్దం కలిసి, శ్రీకృష్ణుడు చేసే నాట్యానికి తగిన తాళంగా అమరింది. ఈ విధంగా శ్రీకృష్ణుడు వెన్నకోసం ఆడే నాట్యం నాకంటి ముందు సదా ప్రత్యక్షం కావాలి.

5) హర్తుం కుమ్భే వినిహిత కరః సాధు హైయఙ్గవీనమ్,
దృష్ట్వా దామగ్రహణచటులాం మాతరం జాతరోషామ్॥
పాయాదీషత్ప్రచలితపదో నాపగచ్ఛ న్న తిష్ఠన్
మిథ్యాగోప స్సపది నయనే మీలయన్ విశ్వగోప్తా॥

శ్రీకృష్ణుడు వెన్నకోసం వెన్నకుండలో చేయి పెట్టాడు. దానిని చూచి యశోద కోపంతో అతనిని కట్టడంకోసం తాడును తీసికోవాలని తొందరపడుతున్నది. అది గమనించిన కృష్ణుడు అక్కడనుండి వెళ్ళిపోవాలని తాను ఎత్తిన పాదాన్ని ముందుకు పెట్టలేక, వెనుకకు పెట్టలేక , భయంతో కన్నులను మూసికొన్నాడు. ఆ విధంగా భయాన్ని నటించేవాడు, లోకానికి రక్షకుడు అయిన మాయాగోపాలుడు నన్ను రక్షించాలి.

6) వ్రజయోషిదపాఙ్గవేదనీయమ్ మధురాభాగ్య మనన్యభోగ్యమీడే,।
వసుదేవవధూస్తనన్ధయం తత్ కిమపి బ్రహ్మకిశోరభావదృశ్యమ్॥

రేపల్లెలోని చిన్న వయసులో ఉండే గోపికలు తమ కడగంటి చూపులతో శ్రీకృష్ణుని చూస్తున్నారు. వారి చూపులు అతనిపై బాణాలవలె తగిలి, అతనిని వారికి విధేయునిగా చేస్తున్నవి, మధురానగరం చేసికొన్న పుణ్యమే శ్రీకృష్ణుని రూపంలో అవతరించినట్లున్నది. అతడు, తనను తప్ప వేరెవ్వరిని కోరని పరమైకాంతులకే దర్శించడానికి వీలయినవాడు. వసుదేవుని పత్ని అయిన దేవకికి చంటిబిడ్డయైనవాడు. దర్శించడానికి చాలా అందమైనవాడు. అద్భుతమైన ఆ పరతత్త్వాన్ని నేను స్తుతిస్తాను.

7) పరివర్తితకండరం భయేన, స్మితఫుల్లాధరసంభవం స్మరామి,।
విటపిత్వనిరాసకం కయోశ్చిత్, విపులోలూఖలకర్షకం కుమారమ్ ॥

వెన్నను దొంగిలించే శ్రీకృష్ణుని యశోద రోటికి కట్టివేసింది. ఆ రోటిని లాగుకొంటూ, అతడు దొంగభయాన్ని నటిస్తూ, మెడను వెనుకకు తిప్పి చూస్తున్నాడు. చిగురువలె అందంగా, . ఎర్రగా ఉండే అతని అధరంపై చిరునవ్వు మెరుస్తున్నది. మద్ది చెట్ల రూపాన్ని పొందిన ఎవరో ఇద్దరు శాపగ్రస్తులకు (నలకూబరమణిగ్రీవులనే ఇద్దరికి) ఆ రూపాలను పోగొడుతున్నాడు. అటువంటి బాలకృష్ణుని నేను ధ్యానిస్తున్నాను.

8) నికటేషు నిశామయామి నిత్యం నిగమాన్తై రధునాపి మృగ్యమాణమ్ 1
యమలార్జున దృష్టబాలకేళిం, యమునాసాక్షికయౌవనం యువానమ్ 11

శ్రీకృష్ణుడు వేదాలచే అన్వేషింపబడే పరమపురుషుడు. అతని బాల్యలీలను మద్దిచెట్ల జంట దర్శించింది. అతని యౌవనలీలను యమునానది కంటికి ఇంపుగా దర్శించింది. అటువంటి శ్రీకృష్ణుని నా సమీపంలో సదా దర్శిస్తాను.

9) పదవీ మదవీయసిం విముక్తేః అటవీసంపద మంబువాహయంతీమ్, ।
అరుణాధరసాభిలాషవంశాం కరుణాం కారుణమానుషీం భజామి. ॥

శ్రీకృష్ణుడు మోక్షాన్ని పొందడానికి చాలా దగ్గరలో ఉండే ఉపాయం. మేఘంవంటి అతని కరుణవల్ల బృందావనంలోని సంపద అంతా (ప్రాణికోటి)ఉజ్జీవించింది. అతని ఎర్రని అధరరసాన్ని వేణువు ఆశతో పానం చేయగోరుతున్నట్లున్నది. అటువంటి, జగత్కారణరూపుడైన, మానవరూపాన్ని ధరించిన, కరుణారూపుడైన శ్రీకృష్ణుని భజిస్తున్నాను.

10) అనిమేష నిషేవణీయ మక్ష్ణోః, అజహద్యౌవన మావిరస్తూ చిత్తే, ।
కలహాయితకుంతలం కలాపైః, కరుణోన్మాదకవిగ్రహం మహో మే ॥

కనురెప్పలు వేయకుండా సదా దర్శించదగినది, ఏనాడూ కోల్పోని యౌవనాన్ని కల్గినది, నెమలి పింఛాన్ని మించిన, అందమైన ముంగురులను కల్గినది, ఇంద్రియాలకు మోహాన్ని కల్గించే లీలలను కల్గినది అయిన శ్రీకృష్ణుడనే తేజోరూపం నా చిత్తంలో ప్రత్యక్షం కావాలి.

11) అనుయాయి మనోజ్ఞవంశనాళైః, అవతు స్పర్శితవల్లవీవిమోహైః,
అనఘస్మితశీతలై రసౌ మాం, అనుకంపాసరిదంమ్బుజై రపాంగైః.

మధురమైన మురళీనాదాలచే అనుసరింపబడినవి, గోపికలకు మనస్సులో మోహాన్ని కల్గించేవి, స్వచ్ఛమైన మందహాసంతో చల్లనివి, కరుణ అనే నదిలోని తామరపూవులవలె ఉన్నవి ఆయిన కటాక్షాలతో ఈ శ్రీకృష్ణుడు నన్ను రక్షించాలి.

12) ఆధరాహితచారువంశనాళాః, ముకుటాలంబిమయూరపించమాలాః,
హరినీలశిలావిభంగలీలాః, ప్రతిభా సంతు మమాంతిమప్రయాణే.

తన అధరంలో అందమైన మురళిని పెట్టుకొన్నవాడై, శిరస్సుపై వేలాడే నెమలి పింఛాల మాలను ధరించినవాడై, ఇంద్రనీలమణిఖండంవలె మెరిసేవాడైన శ్రీకృష్ణుని నీలవర్ణంలోని కాంతులు నాకు నా అంతిమప్రయాణంలో ప్రత్యక్షం కావాలి.

13) అఖిలా నవలోకయామి కాలాన్, మహిళాలీనభుజాంతరస్య యూనః,
అభిలాషపదం వ్రజాంగానానాం, అభిలాపక్రమదూర మాభిరూప్యమ్.

లక్ష్మీదేవివశంలో ఉండే వక్షఃస్థలాన్ని కలవాడు, యౌవనాన్ని కలవాడైన శ్రీకృష్ణుని అందం, గోపికలు ఆశ పడదగినది, మాటలకు అందని వైభవాన్ని కలిగినది. అటువంటి అతని అందాన్ని అన్ని సమయాలలో దర్శిస్తాము.

14) హృది ముగ్ధశిఖండమండనః. లిఖితః కేన మమైష శిల్పినా,
మదనాతురవల్లవాంగనా, వదనాంభోజదివాకరో యువా.

అందమైన నెమలిపింఛాన్ని ధరించినవాడు, తనపై కల మిక్కిలి ప్రేమవల్ల ఆర్తిని పొందిన గోపికల ముఖాలనే పద్మాలను వికసింజేసే సూర్యుడైన ఈ యువకుడు (శ్రీకృష్ణుడు) నా మనస్సులో ఏ శిల్పిచే లిఖింపబడ్డాడోకదా!

15) మహసే మహితాయ మౌలినా, వినతేనాంజలి మంజనత్విషే
కలయామి విముగ్ధవల్లవీ వలయాభాషితమంజువేణవే.

మహనీయమైనది, కాటుకవంటి రంగును కలిగినది, మిక్కిలి అందమైన గోపికల గాజులచే సంభాషింపబడినది (వేణువును శ్రీకృష్ణుడు ఊదేటపుడు ఆ వేణుధ్వనికి తగినట్లు గోపికలు తమ చేతులతో తాళం వేయగా, అపుడు వచ్చిన వారి గాజుల సవ్వడి వేణునాదానికి తగినట్లున్నది), అందమైన వేణువును కల్గినది అయిన శ్రీకృష్ణుడనే జ్యోతిస్సుకు తలవంచి వినయంగా అంజలిని చేస్తున్నాను.

16) జయతు లలితవృత్తిం శిక్షతో వల్లవీనాం,
శిథిలవలయశింజా శీతలైః హస్తతాళైః,
అఖిలభువనరక్షా గోపవేషస్య విష్ణోః, ఆధరమణి
సుధాయా మంశవాన్ వంశనాలః.

శ్రీకృష్ణుడు ఆడే రాసక్రీడలో అతనితో పాటు. ఆనందించే గోపికలు కిందకు జారే గాజులను కల తమ చేతులతో తాళాన్ని వేస్తున్నారు. ఆ తాళంతోపాటు వారి చేతులలో జారే గాజులు చేసే సవ్వడి కూడా కలిసి, మధురంగా ధ్వనిస్తున్నది. దానివల్ల లలితమనే అభినయవిశేషం కల్పింపబడినట్లున్నది. శ్రీకృష్ణుడు లోకాలను అన్నిటిని రక్షించడంకోసం గోపాలవేషాన్ని ధరించాడు. ఆ స్వామి ఎర్రని అధరంలోని సుధను ఆ మురళి ఆస్వాదిస్తూ గొప్పగా వెలుగతున్నది

.

17) చిత్రాకల్పః శ్రవసి కలయన్ లాంగలీకర్ణపూరం,
బర్హోత్తంసస్ఫురితచికురో బంధుజీవం ధానః,
గుంజాబద్ధా మురసి లలితం ధారయన్ హారయష్టిం,
గోపస్త్రీణాం జయతి కితవో కో ఽ పి కౌమారహారీ.

శ్రీకృష్ణుడు తన చెవిలో లాంగలి అనే పూవును అలంకరించుకొన్నాడు. నెమలిపింఛాన్ని పెట్టుకొన్నందున వెలుగుతున్న. కేశపాశాన్ని కల్గి ఉన్నాడు. బంధుజీవమనే పూవును ధరించాడు. గురివిందపూసలతో కూర్చిన హారాన్ని వక్షస్సులో ధరించాడు. ఈ విధంగా పలు ఆభరణాలను ధరించినవాడు, గోపికల కౌమారాన్ని దోచుకొన్నవాడైన, గొప్ప తుంటరి అయిన శ్రీకృష్ణుడు గొప్పగా ప్రకాశిస్తున్నాడు.

18) లీలాయష్టిం కరకిసలయే దక్షిణే న్యస్య ధన్యాం,
అంసే దేవ్యాః పులకనిబిడే సంనివిష్టాన్యబాహుః,
మేఘశ్యామో జయతి లలితం మేఖలాదత్తవేణుః
గుంజాపీడస్ఫురితచికురో గోపకన్యాభుజంగః.

చిగురువలె సుకుమారమైన కుడిచేతిలో లీలాదండాన్ని ధరించినవాడు, పులకలను కల నీళాదేవియొక్క భుజంపై ఇంకొక చేతిని పెట్టుకొన్నవాడు, మొలనూలులో మురళిని పెట్టుకొన్నవాడు, గురివిందమాలతో వెలిగే కేశపాశాన్ని కలవాడు, మేఘంవలె నీలవర్ణుడు, గోపికలపట్ల ప్రేమను కలవాడైన శ్రీకృష్ణుడు గొప్పగా వెలుగుతున్నాడు.

19) ప్రత్యాలీఢస్థితి మధిగతాం ప్రాప్తగాఢాంకపాలిం,
పశ్చా దీషన్మిలితనయనాం ప్రేయసీం ప్రేక్షమాణః,
భస్త్రాయన్త్ర ప్రణిహితకరో భక్తజీవాతు రవ్యాత్,
వారిక్రీడానిబిడవసనో వల్లవీవల్లభో నః.

శ్రీకృష్ణుడు జలక్రీడను ఆడుతున్నాడు. నడుముకు వస్త్రాన్ని బిగువుగా కట్టికొన్నాడు. అపుడు ఉపయోగించడంకోసం భస్త్రాయంత్రాన్ని చేతితో పట్టుకొన్నాడు. ఆ సమయంలో ఒక గోపిక నీటిలోకి దిగి, ఒక కాలును ముందుకు పెట్టి, ఇంకొక కాలును వెనుకకు చాపి నిలిచింది. దానిని గమనించి కృష్ణుడు ఆమె వెనుకకు చేరి, ఆమెను గాఢంగా ఆలింగనం చేసికొన్నాడు. ఆమె ఆనందపారవశ్యంతో తల కొంచెం వెనుకకు తిప్పి, అతనిని క్రీగంట చూచింది. శ్రీకృష్ణుడుకూడా ఆమెను అనురాగంతో చూచాడు. ఇటువంటి లీలలతో గోపికలకు వల్లభుడైనవాడు, భక్తులకను ఉజ్జీవింపజేసే ఔషధమైన శ్రీకృష్ణుడు మనలను రక్షించాలి.

20) వాసో హృత్వా దినకరసుతాసన్నిధౌ వల్లవీనాం
లీలాస్మేరో జయతి లలితామాస్థితః కున్దశాఖామ్ ।
సవ్రీడాభి స్తదను వసనే తాభి రభ్యర్థ్యమానే
కామీ కశ్చి త్కరకమలయో రఞ్జలిం యాచమానః ॥

యమునానదీసమీపంలో గోపికల వస్త్రాలను దొంగిలించి, అందమైన గురువింద చెట్టుకొమ్మపై కూర్చున్నవాడు అపుడు సిగ్గుపడిన గోపికలు తమ వస్త్రాలను తిరిగి ఇమ్మని అర్థించినపుడు, తామరపూవులవంటి తమ రెండు చేతులతో వారిని అంజలిని చేయమని కోరినవాడు, ఆ లీలతో చిరునవ్వు నవ్వేవాడైన అద్వితీయుడైన ఒక కాముకుడు (శ్రీకృష్ణుడు)గొప్పగా ప్రకాశిస్తున్నాడు.

21) ఇత్యనన్యమనసా వినిర్మితాం వేంకటేశకవినా స్తుతిం పఠన్ ।
దివ్యవేణురసికం సమీక్షతే దైవతం కిమపి యౌవతప్రియమ్ ॥

శ్రీకృష్ణునిలో తప్ప వేరు ఏ విషయంలోను మనసు లేని (అనన్యమైన మనస్సును కల) వేంకటేశకవి అనే వేదాంతదేశికులు ఈ విధంగా రచించిన గోపాలవింశతి అనే ఈ స్తుతిని భక్తితో పఠించినవారు గొప్పగా వేణువును ఊదడంలో సమర్థుడైనవాడు, యువతులకు ప్రియుడైన ఒక అద్భుతదైవాన్ని (శ్రీకృష్ణుని) దర్శించగలరు.

గోపాలవింశతి సంపూర్ణమ్.